గీ. కరుణ నాలింపఁగదవయ్య ♦ కాలకంఠ !
దయ గనుంగొనఁగదవయ్య ♦ దక్షవైరి !
జాలి బలికింపఁగదవయ్య ♦ ఫాలనేత్ర !
కృపనభీష్ట మీఁగదవయ్య ♦ కృత్తివాస !

పర—జలంధరా! త్రిలోకాధినాథుండవై యుంటివి. ఇంకను నీకుఁ గావలసినదేమి ? అయినఁ నీమనోభీష్టము వేఁడికొనుము.

జలం—(స్వ)

ఉ. పంకజనేత్ర నిమ్మనిన ♦ భావజవైరి యనుగ్రహించునో
కింకవహించునో? యొసఁగఁ ♦ గీటడఁగింపఁ దలంచునో ననున్
శంకరుఁ డంతకూరుఁడె? ని♦శాకరశేఖరుఁడంత దుష్టుఁడే ?
సంకటపెట్ట భక్తుని నొ♦సంగగ నేరక యొక్క-కామినిన్.

పర—జలంధరా ! వరమర్థింప యోజించుచుంటివేమి ?

జలం—(స్వ) కానీ! కోపించినమాత్రమేమి? ఈ జంగమయ్య నన్నేమి చేయఁగలఁడు ? (ప్ర) కామాంతకా ! ఈకామినిని నాకొసంగుము.

పార్వ—(స్వ) ఓరి ద్రోహీ !

పర—(స్వ) ఔరా! వీఁడెంతద్రోహము దలపెట్టెను ! కానీ ! మోసమునకు మోసమే తగినది. (ప్ర) ఓరీ ! జలంధరా! పార్వతిని నీకొసంగుచుంటిని కాని—

జలం—ధన్యోస్మి!—కాని—కాని యేమి ?

పార్వ—(స్వ) ఇమ్మహాత్ముఁ డేమనునో ?

పర—

గీ. అంబుజాక్షిని దాసిగా ♦ నవధరింపు
మిచ్చవచ్చినపనులు సే ♦ యించుకొమ్ము

గాని యీచాన నంటితి ♦ వేని నీవు
పొడవడంగ దగ్గి నంటి ♦ పురువుఁ బోలె.

జలం — ఆ! ఆ! దేవదేవ! మహానుభావ! ఎక్కడ నేర్చుకొంటి వీనీతి — ఎవరు చెప్పిరి ?

ఆ. వె. దయితనొసఁగి ముట్ట ♦ దగదంటి వీఁక నట్టి
తరుణి యేటి కింటఁ ♦ దాఁచుకొనన ?
పండునొసఁగి దాని ♦ భక్షింపవలదంట
యెందు నేర్చుకొంటి ♦ విందుమౌళి !

పర — ఓరీ! దుష్టా! ఈకాంత ననుభవించుటకా నీవుద్దేశించితివి? ఔరా! ఎంత కండకావరము !

ఉ. పాణులు మోడ్చి యాదినము ♦ "వాంఛయొసంగవె" యంచు వేఁడి నై
రాణి నొసంగమందువఁట ♦ రా! యఘమెంచక, దాహమక్కటా!
ప్రాణము నిల్వఁబోదనుచుఁ ♦ బాదములంబడి కోరి మీఁద, నీ
శోణితమిట్లుటన్న క్రియ ♦ శుంఠ! దురాత్మక! దానవాధమా!

జలం — నే నెట్లు వేఁడిన నేమి? నీవు నిచ్చితినంటివిగదా ! ఇంక నీగోల యెందులకు ?

పర — మంచిది. నేఁ జెప్పినట్లు జేయుము.

జలం — ఎట్లు? అంటకుండఁగాఁబోలు — చాలు.

శా. దేవా! యేటికి వేఁడికొంటి నిను నీ ♦ దేవేరి నిమ్మంచు నా
దేవింగాఁగొని నిత్య మిష్టరతులన్ ♦ దేలంగ యోజించికా
దే? వాంఛించితినయ్య యూరకయ నే ♦ త్తిందాల్చి యూరేఁగ; వా
గ్వాదంబిది యేల ? యిచ్చెదవ దే ♦ విన్ లేద? వాకుర్విమా?

గీ. పరిమళముఁ బీల్చఁదగనట్టి ♦ ప్రసవమేల ?
యారగింపఁగఁ దగనట్టి ♦ యశనమేల ?

తా్రిప్రటకుఁ దగనట్టి ఖీ ♦ రమ్మదేల ?
అనుభవింపఁగఁ దగనట్టి ♦ యతివయేల?

పర—ఓరీ! దురాత్మా! త్రిజగజ్జననిగదా యీకాంత! ఏమని కామన చేసితివిరా ?

జలం—త్రిజగజ్జననియా ? అయిన నీవెందులకు వరించితివో ముందు వచింపుము. ఓహో ! మఱచితిని. నీవు త్రిజగజ్జనకుండవు గాఁబోలు. అటులైనమాత్రము నేనును ముల్లోకములకుం బ్రభుఁడగానఁ ద్రిజగజ్జనకుండనే—ఇంకనేమి ? సరిపోయినది గాదా? ఓత్ర్యంబకా! ఈ నీకుయుక్తులు నాదండ సాఁగిరావు. సత్యము నిలుపుకొనునదియు లేనిదియు వచింపుము. సత్యము సర్వజగదాధారమనుమాట మఱవకుము.

పార్వ—(స్వ) ఆర్యపుత్రుఁ డసత్యభీతిచే నీదైత్యుని శిక్షింపఁజాల కున్నాఁడు. నే నిట్లని చూచెద—(ప్ర) దానవేంద్రా!

సీ. అలికనయనుని ఫాలనే ♦ త్రాగ్నివలనఁ
బ్రాకటముగం బుట్టి యతని పు♦త్రుఁడవుగావె ?
అట్టి తండ్రికి నిల్లాలి ♦ నైన నన్నుఁ
దల్లిఁ గామనచేయుట ♦ ధర్మనయ్యా ?

జలం—ఓజాణా! అలికనయనుని ఫాలనేత్రాగ్నివలన జన్మించితినే గాని యతనికి నీకును బుట్టినవాఁడను మాత్రముగానుగాదా ? అదిగాక పశువులలో నసురులలో నీనీతి లేదు. నీవు నీతిబోధింప నలసిన దివ్యుఁడైన దేవసార్వభౌమునకుఁ గాను—అప్రమథ సార్వభౌమునకు. ఆతఁ డసత్యమాడుటకు సిద్ధముగానున్నాఁడు. తగదని ధర్మోపదేశము గావింపుము. తలవాంచి మిన్నకుంటి వేమి? నీ ప్రాణనాథుఁ డాత్మదత్తాపహరణవిద్యానిపుణుఁడై వెలుఁగ నున్నాఁడని నీకుఁ దలవంపులయ్యెనా? నిజము—పుర

షులకన్న నిక్కాలమున కాంతలే ధర్మమునకు వెలిచువారు.
సరి—అయిన నింక నతనితో నీకుఁగాని నాకుఁగాని ముల్గొ
నంతయుఁ బనిలేదు. అతఁడు నాకు నిన్ను దానమిచ్చినవాఁడు.
నీ విదానవుదానవు. పోవుదము రమ్ము—(చీరచెఱఁగునంటఁ
బోయి పార్వతి దూరమున కరుగ) ఏమి ? పార్వతీ ! భర్త
మాట నిలుపవలసిన భారము భార్యదిగాదా ? అట్లుపోయెద
వేమి ? నిలువుము—నిలిచి మాటాడుము.

పార్వ—ఇట్టి నీచునితో మాటాడవలసిన యావశ్యకము నాకేమి ?

జలం—ఇదివఱకు లేకున్న నింకపైనుండును గాదా ?

పార్వ—ఏల ?

జలం—భర్తతో భార్యకావశ్యకము లేకపోవునా ?

పార్వ—ఛీ! దురాత్మా ! మాతృద్రోహసక్తా! జాగ్రత్త ! శపించిన
భస్మమయ్యెదవు.

జలం—ఆహా! శపించెదవా? మన్మథుని భస్మమొనర్చిన మహారసికాగ్రే
సరునియిల్లాలవు. నీ వీనవమన్మథుని భస్మమొనర్చెదవు గాఁబో
లు! భస్మము నేమిచేసెదవు ? నీ ప్రాణనాథుని విధమున మేన
నలందుకొందువా ? అటులైనఁ గొంతవఱకుఁ గృతార్థుఁడనే
యయ్యెదనుగాదా? పార్వతీ! కోపమెందులకు? చూడు. నేను
నామోహము దీర్చుకొనుటకు మాత్రమే నిన్ను వరింపఁ దలంపుఁ
గొనలేదు. నీ మేలుఁగూడఁ గోరితిని. ప్రసవకోమలవగు నీ
వీకొండవీటిజంగమయ్యతో నిడుమలు పడుచుండఁ జూడలేకుం
టిని. ఎలజవ్వనమున నొప్పు నీ వీకామాంతకుని దండనున్న
నొకింతయు ఫలము లేదని యోజించితిని. నీకుమాత్రమీ ప్రారబ్ధ
మెందులకు ? ఇతఁడు వదలిన నీకు శనివదలినట్లే. నేనిప్పుడు
త్రిలోకాధిపతిని—నీయిచ్చవచ్చునసుఖము ననుభవింపవచ్చును.

(అనుబంధము 10)

సీ. పాటలాధర! సల్ల ♦ కాట నుండుటకన్న
వేల్పుఁబోఁ)లున నుంట ♦ వేడ్క గాదె?
చెలి! పిశాచములతో ♦ సేవ లందుటకన్న
సురలుకొల్వఁగనుంట ♦ పరువుగాదె ?
కంజాక్షి ! బిచ్చంపు ♦ గంజిఁదాి)వుట కన్నఁ
బీయూషమానుట ♦ పి)యముగాదె ?
కుసుమకోమల! పాడు ♦ బసరమెక్కుటకన్న
నైరావతము నెక్కు ♦ టరుదుగాదె ?
గీ. కొండవీటి జంగమువానిఁ ♦ గూడి యిట్లు
చెప్పరానియిక్కట్టులు ♦ సెందుకన్న
ఎల్లలోకమ్ము లేలు న ♦ న్నిచ్చగించి
మగువ! సుఖములఁ దేలుట ♦ దగవుగాదె ?

పార్వ—ఓరీ! దుర్మదాంధా! ఎగిరిపడకుము. నీ యైశ్వర్యమునకు మన్నాథుఁడే కారణమనుమాట స్మరింపుము.

జలం—నా యైశ్వర్యమునకే కాదు—నా సౌఖ్యమునకును గూడను. కావుననే నిన్నుఁగూడ నొసంగినాఁడు. శంకరా! భక్తవశంకరా! అవునుగాదా ?

శర—తుచ్ఛుఁడా ! నోరుమూసికొనుము.

జలం—మహాదేవా! నేను నోరుమూసికొనుటకు నసత్యమాడితినా ? నీతో నాకెందులకు ? పార్వతీ! ఏమనెదవు? నా హితోక్తుల నాలించి నను వరింపుము.

పార్వ—నీచుఁడా! నీ కండకావర మంతకంత కధికమగుచున్నది.

జలం—నీ బిగిసికొనుటమాత్రి) మంతకంత కధికమగుట లేదా ? కాని యీబిగిసికొనుట నీభర్తకడ నేమిచూచికొనియో నాకుమాత్రము బోధపడుట లేదు.

ఆ. వె. భూషణములు లేవు ♦ భుజగమ్ములే గాని
భూతి లేదు పాదు ♦ బూదె గాని
కట్టబట్ట లేదు ♦ కరిచర్మమే గాని
వీడు లేదు పెద్ద ♦ కాడుగాని.

ఆ. వె. తిండి యైన లేదు ♦ తిరిపెంపు గంజియే
గాని యెట్టి వేళ ♦ నైన నదియు
నడిగికొనుట కైన ♦ నరయఁ బుర్రయె గాని
పాత్రమైన లేదు ♦ పద్మనయన!

గీ. రసికుఁడా యన్న మారుని ♦ మసియొనర్చి
నట్టి చెనఁటి, రాజా యన్న ♦ నాదిభిక్షు
వైన మైఁదాల్చె నని యాత్మ ♦ నలరెదేమొ
నెత్తి నెక్కించుకొన్నాఁడు ♦ నీకు సవతి.

గీ. ముద్దు లిడుకొనఁబోయిన ♦ బుస్సుమంచు
పాము గఱువంగ రాదఁటే ♦ పద్మనేత్రి!
కౌఁగిలించెద వేనియుఁ ♦ గలఘు మెడల
బూదియంటుకు గాఁదటే ♦ పూవుఁబోఁడి!

ఇట్టి తగనిమగనితో, నిట్టి యకించనునితో, నిట్టి విరసునితో, నిట్టి నిర్భాగ్యచక్రవర్తితో నెన్నాళ్లేడ్చెదవు? రా—రమ్ము, పోవుదము. (పార్వతి వెంటఁబడును—పార్వతియటునిటుఁ బరుగిడుచు.)

పర—ఓరీ! దురాత్మా! ఇదిగోఁ జచ్చితివి రా! (శూలముతోఁ బొడుచును.)

జలం—(మూర్ఛిల్లును.)

తులసి—(పరుగెత్తికొనివచ్చి) చంద్రశేఖరా! రక్షింపుము. రక్షింపుము. నాకుఁ బతిభిక్ష యొసంగుము. (పాదములపైఁబడును.)

క. ఆలింపవె నా యార్తిని
బాలింపవె జాలి నాడు ♦ ప్రాణేశ్వరునిన్
జాలింపవె కోపం బెద
శైలసుతాహృదయనాథ! ♦ చంద్రార్ధధరా!

పర—(లేవనెత్తి) అమ్మా! భయము లేదు. అతఁడు మూర్ఛిల్లినాఁడు. కొంతవడికి మూర్ఛఁదేఱును. బుద్ధిచెప్పి తోడ్కొనిపొమ్ము. మే మింకఁ బోయెదము.

(నిష్క్రమించుచున్నారు.)

జలం—(లేచి) ఆ! ఆ! పరమేశ్వరా! నిలువుము. పార్వతీ! పోకుము. (పోఁబోవును.)

తుల—ఆర్యపుత్రా! కొంచెము నిలువుము. నామనవి నించుక యాలింపుము.

జలం—(ఆశ్చర్యముతో) అ! ఆ! నీ వెందులకు వచ్చితి విచ్చటకు? ఎట్లు రాఁగలిగితివి? ఎప్పుడువచ్చితివి? సరి, పిమ్మట మాటాడుదము. పార్వతి పరుగెత్తికొనిపోయినది కాఁబోలు. ఇంకఁదడయఁగూడదు. నీ విందే యుండుము.

తుల—నాథా! జగజ్జననిం గామింతురా! తగదు. మీపాదములపైఁ బడి వేడుకొందును—తగదు—మనపురంబునకుఁబోదము రండు.

జలం—ఏమే నీకు సవతివచ్చునని భయపడుచుంటివా?

తుల—హృదయేశ్వరా! నాకు సవతివచ్చునని భయపడుట లేదు. మీకు కీడువచ్చునని భీతిల్లుచుంటిని. ప్రాణనాథా! మీరు పరిగ్రహింపవలయు నన్న నెందఱు సుందరులు లేరు?

కం. లేరే యప్సరసలు కలి
లేరే మనుజసతులు దాన ♦ వాంగనలు మరు

ఘ్నారమణులుఁ లేరే?
భూరమణా! యింబఁ గోరఁ ♦ బోలునె చెప్పుమా?

జలం— లేకేమి? నీవంటి కాంతామణులు వేనవేలున్నారు.

గీ. సరసురాలొకర్తు ♦ చాలు, దేవెనదాంతు
లెందఱున్ననైన ♦ నేమిఫలము?
చంపకమ్మొకండు ♦ చాలు, నుమ్మెత్తపూ
లెన్నియున్న లాభ ♦ మేమి? మగువ!

తుల— ప్రాణనాథా! ఆ శైలేంద్రజమ్రోలఁ దక్కిన చెలువలందఱుఁ జంపకముచెంత నుమ్మెత్తపూలే యగుదురు. ఐన నాథా! సంపెంగపూవు నళీంద్రము గాఢింపవచ్చునా? దానఁ గలుగఁ బోవు చేటు విచారింపనలదా? నా ప్రార్థన మాలింపుము. ఈదుర్బుద్ధి విడువుము.

జలం— (స్వ) ఈదయ్య మెక్కడనుండి దాపరించె నాకు? ఇంక నెక్కడి పార్వతి! అది యేగుహలోనో దాగియుండును. ఇప్పుడు దానికై ప్రయత్నించిన లాభము లేదు. ఈ పిశాచి వెంటనుండఁ బ్రయత్నించుటమాత్ర మెట్లు? అన్నన్న! ఇది నా ప్రయత్నముల కెల్ల డ్డము వచ్చుచున్నది? దీనివలన నా కేదో నష్టమున్నదని వివాహకాలమున నే దలంచినది సత్యమే యయ్యెను. మొదట నీభూతమును వదలించుకొనవలయును.

శా. ప్రచండమ్మున వీచిపోవునొకొ నా ♦ కీర్తిస్? గాఢవ్యథా
ప్రాణుగ్యాంబిది యెట్లపంగునొకొ? ధా ♦ రాస్వాంత...
బీఁచుం బూన్చి తెరల్తునో కులట! న ♦ బ్ధిం ద్రోసి మాయింతునో
రోధింపం బని యేమి యుద్ధమొనడో ♦ కొక్క యెట్లుగావించినన్?

ఆ గురుబ్రువుఁడు నాకు లక్ష్యుఁడా? వాఁ డేమిచేయఁగలఁడు? శపించును. ఊఁ, శపింపనీ. ఈపీడ వదలినఁగాని నన్నీచింత వదలదు. కాని ప్రథన

నిర్జితదిక్పాలకుండు, త్రిలోకాధిపతి, జలంధరదానవసార్వభౌముఁ డొక కాంతను జేతులారఁ జంపుట తుచ్ఛపుఁ బని. ఐన దీని సాగనంపుట యెట్లు? (యోజించి) మంచియుపాయ మిది. జాలంధరమున కేఁగి యట్లొనర్చెదను. (తులసితో) ఓసీ! నీ కోర్కెయే తీరినది. ఇంకఁ బోవుదము రా.

తుల—అనుగ్రహింపఁబడితిని.

(ఇరువురు నిష్క్రమింతురు.)

తృతీయరంగము.

[ప్రదేశము—నదీతీరము.]

ప్రవేశము:—బంధింపఁబడిన తులసి నెత్తుకొని

చండి, మువ్వురు పలాశుఁడు.

పలా—ఓసీ! చండీ! నదీతీరమునకు వచ్చితిమి.

చండి—పాడునది! నదిమాట యెందులకు? నా యాలోచన మాట నేమిచేసితివి?

పలా—ఏమది?

చండి—సరిగా వినుము. తులసి చచ్చుటయేగదా జలంధరునకుఁ గావల సినది. నదిలోఁ బడవైచుటకు బదులు దీని మనకడుపులోఁ బడవైచిన నేమి? మనకు బహుమానము తరువాత ముట్టునో, లేదో! ఇట్లుచేసిన ముట్టకున్నను జింతయుండదు.

పలా—ఛీ! ఛీ! నిర్భాగ్యురాలా! మహారాజుమాట నతిక్రమింప వచ్చునా? ఊ—తెల్లవాఱవచ్చుచున్నది. ఎవరైనఁ జూచిన మహారాజుగారి కపకీర్తిగల్గును. నదీగర్భమునఁ బడునట్లు తుల సిని విసరివేయుము.

చండి—నీయిష్టము. (తులసిని విసరివేయుదురు)

పలా—ఊఁ—ఇంక నడుపుము.

చండి—అయ్యో! ఏ జలచరమున కీపదార్థము ప్రాప్తియున్నదో! నా నోటిలో శనియున్నది. ఏమిచేయుదును? (మొసలుగొట్టుకొనుచున్నది.)

(నిష్క్రమింతురు.)

[ప్రవేశము—తులసితో విష్ణుదేవుఁడు]

విష్ణు—

ఉ. అన్నులమిన్న! యెవ్వతవొ? ♦ యాత్మవిభుం డెవఁడో?—నీకు? నిన్
గన్నజనిత్రి యెవ్వతయొ? ♦ గాదిలితండ్రి యెవండొ? యేటికిన్
జెన్నఁటు లెవ్వ రీభ్వాధిని ♦ జిత్తమునం దయలేక త్రోచిరో
యున్నదిలోన నిన్ను వచి ♦ యింపవె దాపక నీచరిత్రమున్.

తుల—ఓ ప్రాణదాతా!

ఉ. లాలితకీర్తియౌ నల జ ♦ లంధరదానవచక్రవర్తి కి
ల్లాలను, బావనాసురకు ♦ లాంబుధిచంద్రుఁడు కాలనేమికిన్
బాలమృగాక్షి మాధవికిఁ ♦ బట్టి, నెఱంద నెఱుఁగ నెవ్వరి
వ్వేళ ననుఁ జదింబడఁగ ♦ వీఁకునఁ ద్రోసిరొ? లేరు శాత్రవుల్.

నేను రాత్రి నిద్రించుటమాత్ర మెఱుఁగుదును. ఎవ్వ రీపనిఁజేసిరో యెఱుఁగ.

గీ. సీటఁద్రోయఁగఁబడి మర ♦ ణింపనున్న
నన్నుఁ బ్రేముడిఁ బ్రోచిన ♦ కన్నతండ్రి
యీ వెవఁడవయ్య! మకరిప ♦ థించి కరిని
రక్షణముసేయు నిందిరా ♦ ప్రాణపతివొ?

విష్ణు—సుందరీ! నే నిందిరానాథుండనే. నీకెవ్వరుశాత్రవులు లేరనుచుంటివి. నీవు పొరపడుచుంటివి.

ఉ. అంచితభక్తి నెవ్వనిజ । యమ్ముగ గోరి యొసంగ మమ్ముఁ బ్రా
ర్థించుచునుందువో? యెవని । దేవుఁడటంచు భజించుచుందువో
నంగలనేత్రి! యమ్మగఁడె । స్వాంతమునన్ గృపవీడి నిన్నుఁ ద్రో
యించెనదే నిజమ్మెఱుఁగు । మింతయునుం బగ నీకు నాథుఁడే.

తుల—హరిహరీ! నామనోదయితుఁడు నిర్దయుఁడుగాఁడు. మీయూహ సత్యముకాదు.

విష్ణు—కాంతా! నీవు నిజం బెఱుఁగకుందువుగాక—నారాయణుండు గూడ నెఱుఁగనేరఁడా?

తుల—(స్వ) నిజమేకాఁబోలు. కాకున్న సత్యస్వరూపుఁ డిమ్మహాత్ముఁ డేల యబద్ధమాడును? హా! ప్రాణనాథా! నేను నీకంత భారమైతినా? నిన్ననసేల? ఇది నా దురదృష్టము. కట్టా! ఈ లక్ష్మీమనోరమణుఁడు నాకేమో మేలుసేసినవాఁడనుకొంటి. ఇది కీడయినది. ఎందులకు నక్కఱకురాని యీ పాడుజన్మ యింతటితో నంతరించుటయే శ్రేయస్కరముగాదా? నే బ్రతుకుట యెందులకు? నానాథునకు భారమగుటకే గాదా? ఇప్పుడేమి సేయుదు? ఆత్మహత్య మహాపాపమునకు హేతువు. అందుల కొడంబడుదునన్నను ఇమ్మహనీయుఁడు నన్నుఁ జావనీయఁడు. తిరుగ నాప్రాణేశ్వరునకుఁ జింత కలిగింపవలసివచ్చినది.

ఆ. పడఁతి నదిని ద్రోయఁ । బడియెఁ బీడవొలంగె
నంచు మివ్వుఁ బగాశె । సించు నాథు.
నెదుట కేను దిరుగ ।। నేఁగి కంటంబడఁ
గటకటఁ బడి యొంత । కనలునొక్కొ?

విష్ణు—పొలఁతీ! నీ విచారము నే నెఱిఁగితిని. నీ వా క్రూరుని చెంతకుఁ (తులసి చెవులు మూసికొనును) బోనక్కఱలేదు. నిన్ను

వికుంఠనగరి నుంచెద. అందు నిర్విచారముగఁ గాలముఁ గడుపుకొనవచ్చును రమ్ము.

తుల—హా! ఏమి నాభాగ్యము. ఓదయానిధీ!

ఉ. కాయలుఁ గందలుం దినుచుఁ ♦ గాననభూములయందు నారతం బాయతభక్తిఁ దావక ప ♦ దాంబుజముల్ భజియించు నాజగ ద్ధేయులకున్ జటీంద్రులకు ♦ దేవ! యొసంగెడు నవ్వికుంఠమున్ మాయురె! మిన్న కీఁదలఁచి ♦ నాఁడవు మామక భాగ్యమేమనన్.

కాని తండ్రీ! నీ వెఱుంగని ధర్మ మేమున్నది? నన్ను మన్నింపుము.

ఆ వె. సతికి భర్తృపాద ♦ సన్నిధికన్న ఘ
నమ్ముగాదు చూవె ♦ నాక మైన
బ్రహ్మలోకమైన ♦ భవుని కైలాసమ్ము
నైన నవ్వికుంఠ ♦ మైన దేవ!

దయయుంచి నా ప్రాణేశ్వరుని చెంతకు నన్నుఁ బంపుఁడు.

విష్ణు—(స్వ) ఔరా! ఏమి యీకామిని పతిభక్తి! (ప్ర) అతివా! నీరమణుఁడు నిన్నుఁ జంపఁదలఁచికదా యిట్లు గావించె. తిరుగ నేగిన నీబ్రతుకు కబద్ధము.

తుల—ఆర్యా! పెఱచోటుల బ్రదుకు కన్న సతికిఁ బతిచెంగటఁ జావు మేలుగాదా?

విష్ణు—సాధ్వీ! ఏమైన నిన్నా క్రూరునిచెంత విడువఁజాల. ఆతఁడు నిన్ను వధించును. జాలంధరమునకుఁ బంపెద.

తుల—దేవా! నా మనోరమణుఁడు జాలంధరమున లేఁడా?

విష్ణు—ససైన్యముగఁ గైలాసమున కేఁగినాఁడు.

తుల—అయ్యో! నా నాథుని కా దుర్బుద్ధి యింకను బోదయ్యోనా? ఆ ఫాలాక్షునిపలన నెట్టి చేటు గలుగనున్నదో! లక్ష్మీమనో నాయకా! నా ప్రాణేశ్వరుని రక్షింపుము.

విష్ణు—నీ పాతివ్రత్యమే రక్షింపఁగలదు. (పైకి జూచి విను నట్లభిన యించి) ఓహో! వాణీధవుండు నుమాధవుండు నెందులకో నన్ను ధ్యానించుచున్నారు. ఇంక నింపుఁ దడయరాదు—అలి వేణీ! జాలంధరమునకుఁ బంపెద—కనులు మూసికొనుము.

తుల—(కనులు మూసికొనును.) (యవనిక జాఱును.)

చతుర్థరంగము.

ప్రదేశము—కైలాసము.

[ప్రవేశము—త్రిమూర్తులు, ప్రమథులు.]

బ్రహ్మ—దేవా! లక్ష్మీధవా!

మ. కరుణాలేశములేక పాపభయముల్ ♦ గాసంతయున్ బూనకే
సురమర్త్యోరగవిష్టపత్రయము సం♦క్షోభింపఁగాఁ జేయుచున్
గరమున్ గర్వమెలర్పఁగన్ దిరుగు లో♦కద్రోహిఁ గ్రూరున్ జలం
ధరు మాయింపఁదలంచ వింత కిదె నీ ♦ ధర్మమ్మొ? మాకర్మమో?

హర—లోకరక్షణపరాయణా! నారాయణా! అది యటుండ మఱియొక యాపదగలిగినది. అది యెవరికోగాదు, నాకు.

ఉ. దారనుగోరి యాతులువ ♦ దైత్యులతోడను గూడి వాడిమిన్
బోరికి నేఁగుదెంచె, ననిఁ ♦ బోడిమిఁ బీడడఁ యింత కింతకుల్
నారి పతివ్రతాత్వము వహించినదాఁక గతింపఁ డాతఁ, డే
దారియొ వాని గీటడఁప ♦ దానవమర్దన! యానతీయవే!

బ్రహ్మ—(స్వ) ఉమానాథుఁడు రమానాథునితో నాభారము నీది యని చెప్ప నేరక మఱుఁగుపఱచుచున్నాఁడు. చల్లకువచ్చి ముంత దాఁచుకొను టెందులకు? ఆమాట నే నుడివెదగాక.

విష్ణు—చంద్రశేఖరా! మనము మొదట యోజింపవలసినది తపోవ సానమున వానికి మన మొసంగిన శంఖము మాట.

బ్రహ్మ—మహాత్మా ! ఆలింపుము.

గీ. మంత్రమో తంత్రమో, యేదో ♦ మాయచేసి
వాని శంఖము హరియించు ♦ వంతు నాది
వనిత భంగపెట్టెడు నట్టి ♦ వంతు నీది
యసుర యసురగా నెడు వంతు ♦ హరునిదయ్య !

విష్ణు—గీ. యత్న మొనరింతు, నొనరింతు ♦ ననఁగ నేల
ఆ జలంధరు వేషమ్ము ♦ నట్టె తాల్చి
చెలువగరితతనమ్మును ♦ జెఱచువాఁడ
మీఁదు యత్నమ్ములను మీరు ♦ మెలఁగుఁడింక.

అంద—ధన్యుల మైతిమి.

విష్ణు—(నవ్వుచు) నారదా ! లోకమునకు హితమగు కార్యమిది—
నీవు దయచేసి యడ్డు రావలదు సుమా !

నార—మహాత్మా ! చెప్పవలయునా మీరు నాకు ?

విష్ణు—ఇంక నే నేగెద. (నిష్క్రమించును.)

పర—అంబుజాసనా ! మనకుఁ దులసి యడ్డు తొలఁగినట్లేగదా ?

బ్రహ్మ—ఇంకను సంశయ మొందులకు ? నాప్రయత్నము వినుఁడు.

గీ. పార్వతింబోలు దానినిఁ ♦ బడఁతి నొకతె
సృష్టిఁజేసి పంపింతు నా ♦ చెనఁటికడకు
స్మరుని బారిని ద్రోసి యా♦సతియె శంఖ
మపహరించి తోతెచుఁ జం♦ద్రార్ధమకుట !

నార—ఉపాయము బాగుగానున్నది.

బ్రహ్మ—నారదా ! నీ విందును అడ్డు రావలదు సుమా !

నార—తండ్రి ! నీవును దాతగారివలె ననుచుంటివా ? నే నెఱుఁగనా?

పర—మన మింకఁ బోదము. (నిష్క్రమింతురు.)



పంచమ రంగము.

కైలాసమున యుద్ధభూమి.

[ప్రమథులు దైత్యులు పోరుచుండ నొకప్రక్కనుండి జలంధరుఁడు
ప్రవేశించును - ప్రమథులు పారిపోవుదురు -
దానవులు వెంబడింతురు ]

జలం—ఓహో! వీరభద్ర బలీభద్ర భద్రకాళప్రముఖ వీరప్రమథులారా! ఏలపాఱెదరు? నిలువుఁడు భయములేదు.

సీ. ఓవిశాలాక్ష! యోరి వీరభద్ర! యో
    రీ బలీభద్ర! యోరి విరూప!
ఓరి వికమ్పన! యో తామ్రలోచన!
    యోరి కుంభోదర! యోరి వికట!
ఓ రణశ్లాఘి! యోరోరి బలోన్మత్త!
    యోరి కుటీచర! యోరి వికృత!
ఓరి మహాకాల! యోరి దుర్జయ! యోరి
    క్రౌంచభేదీ! యోరి కపిలనేత్ర!

గీ. పఱవఁబోకుఁడు మిముఁబోటి పిఱికిబంట్లఁ
    బాడుసేత్తురుగన్నులఁ జూడ నేను
    చూడనోచిన వస్తువుఁ జూపుఁడోరి!
    అఖిలసద్గుణగణధన్య నచలకన్య.

[ప్రవేశము—మాయాపార్వతి.]

మాయా—(స్వ) ఇదిగో! అచలకన్య గాదు. నీపాలిటి మృత్యుకన్య.
    (ప్ర) దానవేంద్రా! జయము! జయము!

జలం—(చూచి యచ్చెరువుతో) ఓహో! ఈ కల్యాణి యెవ్వతె?
    ఇదియె టక్కులాఁడి పార్వతి!

సీ. ఇదియకా? వేలుపు ♦ టింతుల మాఁపునఁ
దలయెత్తఁగా నీని ♦ కులుకులాఁడి
ఇదియకా? స్మరహరు ♦ నింతటివానిని
పలపుస ముంచిన ♦ వన్నెలాఁడి
ఇదియకా? తను సృష్టి♦యించిన విధిఁగూడ
మోహింపఁజేసిన ♦ ముద్దులాఁడి
ఇదియకా? మేయింతి ♦ నేని మెచ్చని వాడు
నద డొంగిలించిన ♦ యెమ్మెలాఁడి

గీ. కలికి యిదియకా నాపాలి ♦ కల్పతరువు
కాంత యిదియకా నాపాలి ♦ కామగవియు
రమణి యిదియకా నాపాలి ♦ యమృతకుంభ
మతివ యిదియకా నాపాలి ♦ యమరమణియు.

గీ. నాతి! నేఁటికిఁ బండెనే ♦ నాతపంబు?
కలికి! నేఁటికి గల్గెనే ♦ కరుణ నీకు?
అతివ! నేఁటికి పణఁగెనే ♦ యభవుగర్వ?
యింతి! నేఁటికి ధన్యుఁడ♦య్యాన మగుంకు?

(చేయిఁ బట్టుకొనఁ బోవును.)

మాయా—(తొలఁగి) ఆ! ఆ! జలంధర! అప్పుడే పాణిగ్రహణమా?
ఒకమనవి నాలింపవలయును.

జలం—అంతకన్న మహాభాగ్య మేమి?

మాయా—నీ పట్టమహిషి, తులసి లావణ్యరాశియని విసయుంటిని,
ఆమె ముందు—

జలం—ఇదియా నీ సందేహము? ఆపీడ వదలినది.

మాయా—అది నే యబద్ధములా?

జలం—అబద్ధముగాదు. దానిఁ గడలిం ద్రోయించితిని.

మాయా—నీవు తిరస్కరించితివి కాని విష్ణుదేవుఁ డామెను గాపాడి బలిపురముఁ జేర్చెను.

జలం—ఏమి! వాని కండకావరము! కానిమ్ము. నీకు భయములేదు. నీ వింట నడుగుపెట్టుటయే తడవుగ దాని కాలునిండఁ బ్రవేశపెట్టెదను. సవతిపోరు నీ కుండదు.

మాయా—ఈ మాయమాటలు నేను విశ్వసింపను.

జలం—అయిన నన్నెట్లు విశ్వసింతువు?

మాయా—నీవు నన్నుఁ బ్రాణముగా మన్నింతువా?

జలం—అంతకన్న నెక్కుడుగ.

మాయా—అయిన నేఁ గోరినఁ బ్రాణములనైన నిత్తువుగాఁబోలు!

జలం—నిస్సంశయముగ.

మాయా—చూతము. ప్రాణప్రదముగదా నీ శిరమునున్న శంఖము? దాని నొసఁగిన ప్రాణ మొసఁగినట్లే! ఏది—దానిని నా కిమ్ము.

జలం—సందేహింతు ననుకొంటివా!

గీ. తలిరుఁబోఁడిరో నీవె కావలయునన్న
శంఖమేమి ప్రాణమ్ము నొసంగనటనె?
సాంపుగ్రియురాలు కోరిన వస్తు వట్టి
యొసఁగ నేరని వాఁ డొక్క రసికుఁడొక్క?

ఇదిగోఁ గైకొనుము! (ఇచ్చి) ఇప్పుడు విశ్వసించితివిగదా? కాని—ఓ బేలా! ఇది నీకెందులకు? హారమా! మణియా! నగయా!

మాయా—అదిగో! ఇంతలోనే దీనిం గొనదలఁచి దేశించుచుంటివా! నీ విట్టి చంచలచిత్తుఁడ వగుదువని యెసువూ నీయొసఁ బట్టరాది తమకముఁ గలిగియు శివుని వదలకుంటిని. నే ననుకొన్నంత గాదు కదా తుదకు!

జలం—ఓముద్దరాలా ! బెదరకుము. దాని నిప్పుడు నీవే ధరింపుము. శంఖ మిచ్చితింగదా ? ఏది ఒక్కముద్దు !

మాయా—ఇక్కడ నేనా ? ఆ నికుంజముచాటునకుఁ బోదము రమ్ము. (నడచును)

జలం—ఆహా ! ఇక్కడ నీ నికుంజ మొక్కటిచె? దీని నే నిదివరకుఁ జూడ లేను సుమా ! ఇదియొక భాగ్యమే !

మాయా—(స్వ) ధాతృపుత్రి దలంచుకొనిన నేమికాదు ? (పరిక్ర మించి నికుంజము చాటునకుఁ బోవును.)

జల—పార్వతీ! అంతతొందఱగఁ బోయెద వేమి? నాకును దొందర గనే యున్నది. వచ్చుచుంటిని, నిలువుము. (పరిక్రమించును.)

(నికుంజము మాయమగును.)

జలం—ఆ! ఆ! ఇది యేమిమాయ! పార్వతి యేది? ఆ నికుంజ మేది? ఆహా! ఇదియంతయు నా దొంగశంకరునిమాయ! మఱి స్వ యంకృతాపరాధము! ఓరీ దురాత్మా! ఇంతులకుఁ దగినశిక్ష ననుభవింతువు. ఎచ్చటం దాగిన నీ ప్రాణములు దక్కవు.

ఉ. ఓరి! దురాత్మ! సిగ్గువడి ♦ యుండక వారలఁ గొంగినట్లు నీ
వారిజనేత్రి నాకడకుఁ ♦ బాపి హరించితి శంఖ మింత నా
పౌరుష మీమి తగ్గెనొకొ? ♦ పాఱకు శూరత నిల్వరా సమి
ద్ధారుణి నిన్ను మన్నెగొని ♦ దారను శంఖముఁ గొందు వ్రేల్మిడిన్.

(పరవళ్ళు ద్రొక్కుచు నిష్క్రమించును.)



## షష్ఠ రంగము.

### ప్రదేశము - జాలంధరము, అంతఃపురము.

[ప్రవేశము— తులసీదేవి.]

(అనుబంధము 11.)

తుల —

గీ. ప్రాణవల్లభు దయకుఁ బా ♦ త్రమ్ముగాని
రమణిజీవిత మటులు, దా ♦ రక విభుండు
లేని రేయిచెలువమట్లు ♦ లీలఁదోఁచెఁగ
వరుఁడు లేమి జాలంధర ♦ పురవరంబు.

మ. మదవద్దైత్య తమిస్రభాస్కరునకున్ ♦ మందాకినీమౌళికిన్
మది భీతిల్లక మానినీమణిఁ గోర్వన్ ♦ మత్ప్రాణకాంతుండు వే
మొ దయన్వీడి యుమావరుండు విభు మా♦యింపందలంపూనునో?
సదయుండై క్షమియించునో? యకట! య♦స్మద్భాగ్యమెట్లున్నదో?

గీ. ఏమి గానున్నదో! యిఁక ♦ నెట్టి చెట్ట
గలుగనున్నదో! కట్టిఁడి ♦ కమలగర్భుఁ
డెట్టిగతి నానుదుట లిఖి ♦ యించినాఁడొ!
దానవస్వామి నొసలనేమిఁ ♦ దలఁచినాఁడొ!

హా! మనోరమణా! జలంధర సార్వభౌమా!

శా. ఏ నిర్భాగ్యను గాన నన్నుఁ గయికో ♦ నిష్టమ్ము లేకుండినన్
బోనీ దానవసార్వభౌమ! కలవా ♦ పూఁబోండ్లు? చేపట్ట నెం
తేనిన్ వందలు వేలు లక్షలును లే ♦ రే? యింత చింతింపకే
ప్రాణాపాయముఁదెచ్చు శైలతనయున్ ♦ వాంఛించి తింకేమనన్.

నాథా! నీతిజ్ఞుండవు. ఇంతకుఁ దెగింతువే? అయ్యో! నిన్ననవేల? ఇది నా దురదృష్టము.

(అనుబంధము 12.)

సీ. ప్రాణేశ! నీన్నుదూ ♦ రం బనియున్న దే?
యిది విధివ్రాత నా ♦ నుదుటిగీత
కాకున్నఁ గలనన్నఁ ♦ గాంక్ష యొక్కటిదక్కఁ
గలిగెనే యెప్పు డిట్టి ♦ కాంక్ష నీకు?
కలుగఁగా కప్సరః ♦ కన్యలు, దానవ
కన్యలు, మానవ ♦ కన్య లుండ
వారిని గోరక ♦ యీరేడు జగముల
తల్లి, సచ్చరితామ ♦ తల్లి, నభవు
వనిత, నింతకుఁ దావక ♦ వాంఛితములఁ
గరుణ సమకూర్చు శ్రితజన ♦ కల్పవల్లి
క్రూరదానవతన్మ్యాజ కు ♦ తారక హిమ
శైలపుత్త్రి వాంఛించెదే ♦ చేలవగుచు?

ఆచార్య! భార్గవా! నిఖిలనీతికోవిదుండవు. అఖిలాగమపారంగతుండవు. స్త్రీవైన నీ ప్రియశిష్యుని వారింపకపోయితివే?

[నేపథ్యమున]—అమ్మా! వారింప కేమి? నేను మాత్ర మూరకొంటినా?

[ప్రవేశము—శుక్రుఁడు పటముతో]

తుల—తండ్రీ! నమస్కారము.

శుక్ర—సుమంగలీభవ! అమ్మా! నే నడ్డగింప లేదనుకొంటివా? అయిన
నామాట నాతఁ డేది వినినాఁడు తల్లీ!

తుల—తండ్రీ! అయిన మీశిష్యుని రక్షించుకొనుటకు మార్గము
లేదా?

శుక్ర—బిడ్డా! వేఱుమార్గమేల? నీసౌశీల్యమును గాపాడుకొనుటయే
నీ మనోహరుని రక్షించుకొనుట.

తుల—ఆ వారియు వారుండు సిటులే చెప్పిరి.

శుక్రా—కుమారీ! వా రట్లు చెప్పిరని నీ వేమఱియుండవలదు. దివ్యులు మాయోపాయవిశారదులు. (స్వ) శంఖాపహరణమునుగూర్చి నుడివిన నీమె మఱింత గుండెవగులును.

తుల—జనకా! నా కా ధైర్యమున్నది.

శుక్రా—తల్లీ! ఏమి ధైర్యము?

తుల—నా పాతివ్రత్యము నేను రక్షించుకొనఁగలనని.

శుక్రా—నాకును నట్టి నమ్మక మున్నది. అయిన మెలకువతో మెలఁగవలయును. అమ్మా! దీనిం గైకొనుము.

తుల—ఏమి?

శుక్రా—నీ కాంతుని రూపపటము.

తుల—(తీసికొని కన్నుల కద్దుకొనుచున్నది.)

శుక్రా—తల్లీ! విధివశమున నీ ప్రాణవల్లభుని స్పృశించుటకుఁగాని పూజించుటకుఁగాని నీవు నోఁచవైతివి. ఈపటమును నిరంతరముఁ బూజించుచు నానందింపుము.

తుల—మహాభాగ్యము!

శుక్రా—నే నింకఁ గైలాసమున యుద్ధ మెట్టులు జరుగుచున్నదో చూడఁ బోయెదను.

తుల—చిత్తము. కాని తండ్రీ! నిరంతరము యుద్ధవార్తలు నాకు సేవకులచేఁ గబురంపుచుండవలయును. మఱియు,

గీ. దైవఘటనావశమున మ ♦ త్స్వామి కొక్క
వేళ ఘోరమృత్యువు సంభ ♦ వించు నేని
ప్రాణపిభుశిరమైన స ♦ వయవమైన
సేవకులచేతఁ బంపుఁడే ♦ జితిని జొత్తు.

శుక్రు—శివశివ ! అమంగళము గలుగకపోవుఁగాక ! తల్లీ ! యిదే మమ్మా ! యిట్లు పలుకుచుంటివి ?

తుల—తండ్రీ ! ఏమంటిని ? ఇది యమంగళమా ? దేవరయనుగ్రహమున మేలగుఁగాక !

శుక్రు—నే నికఁ బోయివచ్చెద.

తుల—చిత్తము.

(శుక్రుఁడు నిష్క్రమించును.)

(పటముఁజూచుచు) హా! మనోరమణ ! భువనైకమోహన! ఏమి నీ రూపము కనుల మిఱుమిట్లు గొలుపుచున్న దే!

ఉ. ఎంత మనోహరుండవు హృ ♦ దీశ్వర! యీపటమంద నీదు రూ
పెంతయుఁగ్రాలెడున్, హృదయ♦మెంతయు లాగెడుఁ,గట్ట! యిట్టి నీ
కింతినినయ్యొ నీయెదుట ♦ నించుక నిల్చి త్వదీయరూపముల్
స్వాంతము వాంఛ నొక్కటతి ♦ నైనఁ గనుంగొన నోఁచనైతి నే!

ఉ. ఎంతని చెప్ప నీకురుల ♦ యింపునుసొంపు నయారె! యయ్యొ! యీ
కుంతలబంధముల్ విడిచి ♦ కోరిక లీరికలెత్త నల్ల సి
చెంత వసించి తావులను ♦ జిందెడు నూనె నలందనైతి జి
క్కింతయుఁ దీయనైతి ముడి ♦ నేయెడ వేయఁగఁ బోలనైతి నే.

గీ. సుప్రసన్న భాసుర మాచు ♦ సొంపుమీఱు
నీదు నిటలతటమ్ము వ ♦ ర్ణింపఁ దరమె
యిట్టినుదుట నక్కట! యెన్నఁ ♦ డేని దనివి
దీఱఁ గస్తురిబొట్టును ♦ దిద్దనైతి.

ఉ. ఎంతవిశాలముల్ బళిర! ♦ యీకను లింపుఁ గృపారసమ్ము దా
మెంతయుఁ జిల్కుచున్నక్రియ ♦నింపుఁదలిర్చెను, నైన నక్కటా!
స్వాంతమునందు సన్నుభగి ♦ వంతునిగాఁ దలపోయు కాంతపై
నింతయునర్థ దయారసము ♦ నేయెడ నేనియుఁ జిల్కవయ్యొ నే.

గీ. ఏమి యీ చెక్కుఖులచంద ♦ మేమియంద
మద్దములువోలె వలరేఖు ♦ నహాహా! నీనిఁ
దమకమున ముద్దులాడంగఁ ♦ దగఁగనైతిఁ
గడకు స్పృశియించు భాగ్య మేఁ ♦ గాంచనైతి.

గీ. తేనెసోనలొలయఁ ♦ దీఱయి చెల్వారు
తావకాధరమ్ము ♦ దరమె పొగడఁ
గట్ట! నోఁచనైతిఁ ♦ గా, యిట్టినీదు కె
మ్మోవి నాను భాగ్య ♦ మునకు నేను.

గీ. ధరణి నీయశఃకీర్తుల ♦ కరణి నీదు
బాహువులుఁగూడ దీర్ఘముల్ ♦ ప్రాణనాథ!
అకట! యిట్టి నీ బాహువు ♦ ధ్యమ్మునందు
నొక్కతఱినైనఁ దమిదీఱ ♦ నొప్పనైతి.

గీ. రమణ! నీదు లోకత్రియీ ♦ రాజ్యమటులె
నీ యురస్సీమయు విశాల ♦ మై యొసంగు;
ఇట్టి నీయురస్థలి నయో! ♦ యెన్నఁడైన
హాయిగా నొడలిం జేర్ప ♦ నైతి నేను.

ఉ. పల్లవసన్నిభంబగు భ ♦ వన్మృదుపాదయుగమ్ము మాన్మనో
వల్లభ! మామకాంకమున ♦ వారక చేరిచి మెల్ల భక్తిసం
ధిల్లగఁ బట్టనోఁచనయి ♦ తిక్క గనుదమ్ముల వద్దనైతి ను
త్ఫుల్లసుమవ్రజంబులను ♦ బూజ లొనర్పఁగఁ జాలనైతి నే!

మనసా! ఎందుల కీదురాశ! అట్టియానందము ననుభవించు భాగ్యము నీ కీ జన్మమున లేదు. ఈపటమును బూజించు భాగ్యమైన నేఁటికిఁ గలిగినది. గుర్వాజ్ఞ నిర్వర్తింపఁ బూజాద్రివ్యములఁ గొనివచ్చెద.

(నిష్క్రమించును.)



ఏడవ రంగము.

[రాత్రివేళము—జలంధరుని రూపుతో విష్ణువు.]

విష్ణు—

ఉ. దానవకోటిఁ గీటడఁచఁ ♦ దాల్చితి నింతకుఁ బెక్కురూపులన్
గాని పలాశిరూపము నొ ♦ కండయినన్ ధరియింప నెన్నఁడున్
హీనత నొచ్చ కద్దియు వ ♦ హించితి నేఁటికి, నట్టి వేషమే
నీ నటకుండు దాల్పవల ♦ దే? మఱిఁ గొంకిన లాభమున్న దే?

సీ. ధరణీశు వేసము ♦ దనరం దగును గాని
వేశ్యాక వేషము ♦ వేయఁ డొకఁడు
మీసముల్ గొఱిగించి ♦ మొలక వేసముఁ దాల్ప
నీచతయం చను ♦ సిగ్గునొకఁడు
కావిపుట్టమ్ములు ♦ గట్టి సన్యాసికా
నేమంతగతి యని ♦ యోచు నొకఁడు
వింజామరమ్ములు ♦ వీచు సేవక పాత్రి
నెవఁడు దాల్చునటంచు ♦ నేవునొకఁడు

గీ. బొమిడికముఁ దాల్చినంతన ♦ భూపుఁ డగునొ?
చీరఁ గట్టిన మాత్రన ♦ చెలువ యగునొ?
దండము ధరించినంతఁ ద్రి ♦ దండి యగును?
బెత్తమును బట్టినంతన ♦ భృత్యుఁ డగునొ?

సీ. శిష్టుల రక్షింప ♦ దుష్టుల శిక్షింప
నానురూపైన నే ♦ యనదరూపు
నైననను, ధరియించి ♦ యవనికి శ్రేయమ్ము
సతతమ్ము గూర్చునా ♦ సరసిగాఁగ
నీతిఁ బోషింప దు ♦ ర్నీతిఁ బరిహసింప
నటకుండు దాల్చు నా ♦ నావిధముల

రూపుల, నటుగాన ♦ రోయుంగఁ బని లేదు
హేయతగా నెంచి ♦ యెవ్వరేని

గీ. ఇంత యోజింప కజ్ఞుల్ హ ♦ సింతు రేని
గుందఁ బని లేదుసూ నట ♦ కుంఠు మదిని
గస్తిదిరుగు రాజభటులి ♦ గాంచి దొంగ
యంచు శునకముల్ మొఱిగిన ♦ యంత నేమి?

గీ. ఎంత బాగుగ నటియించు ♦ నేని, నటకు
లోపముల నెన్ను చుందురు ♦ లోకు, లటులె
ఎంత ధర్మబద్ధం బైన ♦ నేను నేఁడు
సేయు కార్యంబు నెటులు భా ♦ వింత్రు జనులు.

గీ. ఎట్టి వేసమ్ము దాల్చిన ♦ నట్టి తిట్లు
పడిన నటకుఁ డెప్పటి రూపు ♦ గడకుఁ దాల్చు
ఎట్టి వేసమ్ము దాల్చిన ♦ నట్టి శాప
ములఁ గనిన నే నటులె దాల్తు ♦ మొదటిరూపు.

(పరికించి) ఔరా!

గీ. పూర్వ గీర్వాణులకు సుప ♦ ర్వులకు నెత్తఁ
దరముగాని మాధరమెత్తఁ ♦ దరలు నపుడు
తడఁబడని మత్పదమ్ములు ♦ వణఁకఁ దొడఁగెఁ!
బడఁతి భంగపుచ్చు టెఁ కెంత ♦ భార మగును!

ఆహా! పాతివ్రత్య మహాత్మ్య మవాఙ్మానసగోచరముగదా!

శా. చేతోజాత విరోధి యవ్విధి సుర ♦ శ్రేణుల్ దనుం గొల్వఁగా
భూతవ్రాతముఁ బుట్టఁజేయ మనుపన్ ♦ బోకార్పఁగా దక్షుఁడై
స్ఫీతప్రక్రియఁ బొల్చు శ్రీధవు మదిన్ ♦ భీతిల్లఁగాఁ జేయు స
త్పాతివ్రత్యమహాప్రభావ మెడఁదన్ ♦ భావింపఁగా శక్యమే!

ఏమిస్రా యోజించుచుఁ బొద్దుపుచ్చుచుంటిని. ఇంకఁ గర్త

వ్యమునకుఁ గిడంగెను. ఇదియేమిదా తులసి యావరోధము! ఆ దేవి కానరాదేమి? ఓసీ! దాసీ!

[దాసి—ప్రవేశము.]

దాసి—(స్వ) ప్రభువులవా రిప్పుడే దయచేసినారు కాఁబోలు. (ప్ర) దేవా! ఏమియాజ్ఞ!

విష్ణు—దేవి యెచ్చట నున్నది?

దాసి—(స్వ) ఏమబ్బా! ఎన్నఁడు లేనిది దేవిని బరామర్శించుచు న్నాఁడు. ఏయూరిలో వాన గురిసినదో! (ప్ర) దేవా! ఆ మందిరమున నున్నారు.

విష్ణు—మంచిది. ముందు నడువుము.

దాసి—దేవా! ఇటు ఇటు.

(నిష్క్రమింతురు.)



ఎనిమిదవ రంగము.

[ప్రవేశము:—పటమును బూజించుచుఁ దులసీదేవి]

(అనుబంధము. 13)

దాసి—(ప్రవేశించి) అమ్మా! పటమును బూజింప నేల? ప్రాణేశ్వరు నే పూజింతువుగాని లే—మహారాజుగారు దయచేయుచున్నారు.

తుల—ఆ! ఏమే! నిజమా? నా ప్రాణేశ్వరుఁడే తెంచెనా? ఎక్కడ నున్నాఁడు?

దాసి—ఒకచోట నిలుచు నట్లున్నదా? దేవియెక్కడ దేవియెక్కడ నని పరుగెత్తుకొని వచ్చుచున్నారు. అమ్మా! నేఁడు నీ భాగ్యము పండినది. నా యదృష్టముగూడ పండినట్లే!

తుల—ఇదిగో! ఈహారము గొనుము. కాని నా నాథుఁడు వచ్చిన మాట నిక్కమేనా?

దాసి—వచ్చినమాటయేమి! మిమ్ము ననుగ్రహించు మాటకూడ నిక్కమే. వారుగో!

[ప్రవేశము- విష్ణువు జలంధర వేషముతో]

తుల—(స్వ) హా! ఏమి నాభాగ్యము! (ప్ర) ప్రాణేశ్వరా! నమస్కారము!

(సాష్టాంగపడి నమస్కరించును.)

విష్ణు—దేవీ! లెమ్ము. (లేవనెత్తుచున్నాఁడు.)

తుల—హా! నేఁడుగదా నాశరీరము పావనమైనది!

(మూర్ఛిల్లి విష్ణువుచేతులమీఁద వ్రాఁపి కూర్చొని తొడపైఁ బరుండఁ బెట్టుకొనును.)

విష్ణు—(స్వ) ఈకాంత యానందపారవశ్యమున మూర్ఛిల్లినది. ఔరా! ఏమి దీని ప్రేమ! (విసరును.)

తుల—(లేచి సిగ్గుతోఁ దలవంచుకొనుచున్నది.)

విష్ణు—(చుబుకమును స్పృశించుచు) ప్రాణేశ్వరీ! ఏమి నీ పతిభక్తి ఏమి నీ సౌశీల్యము!

చ. పరిణయవేళనుండి నిను ♦ భావమునందుచు నెల్లఁ బోక, నిన్
దరికిని జేరనీక, సత ♦ తమ్ము సుఖింపఁగ లేక, ధూర్తుఁడై
హరహర! సేవకావళుల ♦ నంపి నిమేష సదిఁ ద్రోచినట్టి దు
శ్చరితుని పైని నీకిపుడు ♦ నైతము ప్రేముడియున్న దే ప్రియా!

తుల—హృదయేశ్వరా! ఆమాటల నెత్తకుము. అది నావిధిపరిపాకము. కాకున్న నింత కరుణాకోమలుఁడవు నీకుఁ గాఠిన్య మెచ్చటిది! హా! యొంత సుదినమిది!

విష్ణు—(స్వ) పాపము! ఈకాంత యిది సుదిన మనుకొనుచున్నది. నిశ్చయముగ నిది దుర్దినము! ఈగరిత కేగాదు—నాకును—

గీ. ఎన్నినాళ్ళనుండియొ యభి ♦ వృద్ధిగాంచు
నంగన పతివ్రతాత్వ మ ♦ డంగు నేఁడు
ప్రాజ్ఞతతిఁ గాక నజ్ఞుల ♦ వలన నైన
మామకయశమ్మునకుఁ గల్గు ♦ మచ్చ నేఁడు.

దేవీ! నీపతిభక్తి నెంతని సంస్తుతింతు? నేఁడు నేను దాన వద్దానవద్విషహార్యతుండగు ఫాలాక్షుని బారినుండి బ్రతికి వచ్చుటకుఁ గారణ మేమనుకొనుచుంటివి?

గీ. హరిహరబ్రహ్మ లొసఁగిన ♦ వరపరంప
రలవలనఁ గాదు శంఖము ♦ వలనఁ గాదు
తావకీన పతివ్రతా ♦ త్వప్రభావ
మున నె బ్రతికినవాఁడ నం ♦ భోజనేత్రి!

తుల—ఆర్యపుత్రా! నిన్ను వేఁడుకొనెదను. నన్నుఁ గూర్చిన ప్రశంస మానుఁడు. (గడ్డమంటి బ్రతిమిలాడును.)

విష్ణు—ప్రియా! ఏమి నీ సౌశీల్యము!

(ముద్దుఁ బెట్టుకొనును.)

యవనిక జారును.



తొమ్మిదవ రంగము - యుద్ధభూమి.

[విల్లునమ్ములు, ఖడ్గము దాల్చి జలంధరుఁడు ప్రవేశించును.]

ఓరీ! కంఠేకాల! నీచాత్మా!

గీ. పాఱిపోయితి వేమిరా ♦ ఫాలనేత్రి!
దేబెనైతి వి దేమిరా ♦ త్రిపురదమన!
ఆలిఁ జూచి రాఁబోయితె ♦ వా దురాత్మ!
కదలితార! రక్తముఁ జూతుఁ ♦ గన్నులార.

చీ ! పిఱికిపందా ! ఎందుఁ బోయితివి? నీవు డాఁగిన నీ మృత్యువు డాఁగుననుకొంటివా ?

మ. శతపత్త్రేక్షణుఁ బంపి నాకడకు న ♦ స్వచ్ఛాంఖముంగొంటి, దు
ర్గతి యింకేల రయోరి! పర్వతగుహా ♦ ప్రాంతంబులం దాఁగ, మ
చ్ఛతకోటి ప్రతిమాన ఘోరశరముల్ ♦ శైలమ్ముతో నిన్ను నీ
సతి నీభృత్యులనెంచు, డాఁగిన నినున్ ♦ సాధింపకే పోదునే!

పర—(ప్రవేశించి) దురాత్మా ! జలంధరా ! ఇఁకఁ గాచికో !

చ. అతివ పతివ్రతాత్వ మది ♦ యడ్డగుటం నినుఁ జంపకుంటి దు
ర్మతి ! మితిమీరిపోయితివి ♦ మానిని భంగము వొందెనింక, నీ
గతిగనుఁగోర ! నీవు పద ♦ కంజములం బడివేడినం రమా
పతియు, నజుఁడు నడ్డుపడ ♦ వచ్చినఁ దప్పదు చావు నీకిటన్.

జలం—ఏమిరా! మానిని భంగమువొందుట యేమిరా! నీచాత్మ! నీ సతివలె నాసతి దుశ్చరితకాదు. అయిన దానిపాతివ్రత్యము నన్నుఁ గాచుటయేమి? వృథావాగ్వాదమేల? కాఁచికో!

(ఖడ్గము విసరును.)

పర—(తప్పించుకొని శూలముతోఁ బొడుచుచు నెట్టుకొనిపోవును.)

(తెరలోఁ గలకలము.)

హా ! ప్రియశిష్య ! దనుజవంశోద్ధారక ! జలంధరా !

[ప్రవేశము—జలంధరునిశిరముతో శుక్రుఁడు దుఃఖించుచు]

హా! ఈదివ్యు లెంతమాయచేసిరి ! ఔరా! ధర్మరక్షణ పరాయణుఁడు నారాయణుఁ డిట్లుచేయునే! కానీ! నారాయణుఁ డిందులకుఁ బ్రతిఫలము నందుఁగాక !

ఈశిరముం గొనిపోయి యామాయలాడి భర్తగా విశ్వసించి విహరించుచున్న తులసీదేవికిఁజూపి యాపద్వృత్తాంతము నివేదింతుగాక ! హా తల్లీ ! తులసీ ! నీ వన్నంతయే యయ్యె.

తుదకు నీవిభుని శిరమే గొనివచ్చుచుంటిని. (ధ్వనియగును.) ఓహో! యెవ్వరో వచ్చుచున్నారు. దివ్యులైన నీశిరము జూచిన నపాయము రాఁగలదు. ఇంక నిచటుండరాదు!

(నిష్క్రమించుచున్నాఁడు.)

పదియవ రంగము—శయ్యాగృహము.

[ప్రవేశము—జలంధరరూపముతో విష్ణువు-తులసీదేవి]

తుల—మనోరమణా! నా కర్కశ బాహుమధ్యమున మిగుల నలసితిరి. ఇంతక్షీరము గొనివత్తు, త్రావి నిదురింతురుగాని!

విష్ణు—ప్రేయసీ! నీ యధరామృతముండ క్షీరమేల? అక్కఱలేదు. మఱియు,

గీ. నిరుపమకవీంద్రవిరచిత ♦ సరసకావ్య
మాత్మకరపద్మమునయందు ♦ నలరువేళ
వలపుఁ బ్రియురాలు దనదండ ♦ వఱలువేళ
నాకలియు నిద్దురయు నేటి ♦ కలసగమన!

తుల—పోనిండు. కొంచెము విసరెదను.

(పైటచెఱఁగున విసరుచుండును.)

విష్ణు—(కనులు మూసికొని యోజించుచు)

ఆ. ఏను దెఱవఁజెఱచు ♦ తఱిఁగి జలంధరు
శిరము నఱికినాఁడు ♦ హరుఁడు కలన
తచ్ఛిరమ్ముఁ గేలఁ ♦ దాల్చి దైత్యగురుండు
వచ్చె మిగిలియున్న ♦ పనిని దీర్ప.

[జలంధరుని శిరముతో సుక్రుఁడు ప్రవేశము.]

సుక్రు—(చూచి) హా! తల్లీ! నాకన్నులు చూడలేకున్నవి. ఆ మాయలాని చెంతనుండి లెమ్ము.

తుల—(లేచి) ఆ! ఆ! ఇదియేమి!

శుక్రు—ఇది నీభర్త శిరమమ్మా! అతఁడుమాయలమారి విష్ణుదేవుఁడు.

తుల—ఆ! ఆ! (శయ్యావంకఁ జూచును.)

విష్ణు—(తనరూపము దాల్చును.)

తుల—హా! (మూర్ఛిల్లును.)

విష్ణు—భార్గవా! నీ వచ్చిన పని యైనది కాదా?

శుక్రు—మహానుభావా! నీ వచ్చిన పనిమాత్రము గా లేదా?

విష్ణు—ఏది? ఇంకఁ బాషాణము గావలదా?

శుక్రు—(ఇంచుక యూరకుండి) ఇదియంతయు నిట్లు గావలసియున్నది. దేవా! అపరాధిని. నన్ను మన్నింపుము.

విష్ణు—దనుజాచార్య! ఇదియంతయు నిట్లు గావలసియున్నదని నీవే యంటివి కాదా? ఇం దెవరి తప్పును లేదు.

శుక్రు—అనుగ్రహింపఁబడితిని.

(శిరము దులసిచెంత నిడి నిష్క్రమించును.)

తుల—(మూర్ఛదేఱి) హా! భువనైకవీరా! మనోహర! దానవసార్వభౌమా! ఎంత యన్యాయము జరిగినది!

(మూర్ఛిల్లును.)

తుల—(లేచి)

మ. హృదయేశుండు సమిత్తి తిన్ దొలఁగి దానే తెంచె నం చెంచితిన్
సదయుండై ననుఁజేరఁదీసె ననుచున్ స్వాంతంబునన్ బొంగితిన్
సుదినంబంచుఁ దలంచితిన్ గటకటా! శోకమ్ము వోనాడితిన్
దుది నిట్లాట యెఱుంగ మాధవుఁడిటుల్ ద్రోహమ్ముగావించెనే!

సీ. విభుఁడు సమిత్తి తి విడిచి వచ్చెనటంచు
సకిచెప్పఁ బొందిన సంతసమ్ము

అతిపర్వమ్ముగ • నాత్మేశు రూపమ్ము
గనుఁగొన్న తఱిఁగన్న • కడిఁది మురిపె
మభివందనము సేయ • హస్తపల్లవముల
తో నెత్తఁగన్న సంతోషకలన
తొడలపై నిడుకొని • తోరంపు నునుఘనల
నాడుచో గాంచిన • యట్టిముదము

గీ. మోవి మోవినిఁ జేర్చుచు • ముద్దులాడి
కౌఁగిలి నొడలిని గలుపుచో • నొదినట్టి
పారవశ్యము, నిట్టిదే • పాపి దైవ
మా! యెఱుంగక చెడితి నే • మాయఁబడితి.

విష్ణు — అలివేణీ! శోకింపకుము.

తుల — దేవ! మహానుభావ! శోకింపకు మనుచుంటివా? నీవు చేసిన మే లింతకన్న నేమి?

సీ. పెండ్లినాటంగోలెఁ • బ్రియుని దైవమటంచు
నాత్మఁ బూజించిన • యందులకును
నన్నువిభుం డొల్లకున్న మాంగల్యమ్ము
నరసి జీవించిన • యందులకును
కలనైన విభునకు • గలుగునో సిలుగంచు
యడలుచు నొప్పిన • యందులకును
పతిఁగావరే రమా • వర! హార! యని మిమ్ము
మోదమ్మున భజించి • నందులకును

ఆ. కడకు నిదియ కాదె • కమలాక్షిప్రియా! నాకు
నీ వొసంగు ఫలము • నీ వొసంగు
కడిఁదివరము; నన్ను • కబళమ్ము నర్థింప
విషమొసంగు మాగురు • విధిని నకట!

ఓపరాత్పరా! ఎంతయన్యాయ మొనర్చితివి! ఎంతద్రోహము దలంచితివి! అమలినంబగు నా పాతివ్రత్యమును, నిరుపమానమగు నా సౌశీల్యమును మంటఁగలిపితివే! పరమపతివ్రతను, నిరంతర భర్తృపదారవింద ధ్యానరతను, నన్నొకక్షణమున స్వార్థపరుడవై కులటం గావించితివే! నిన్నేమని నిందింతు! నాదుప్రాప్తికి, నామర్గతికి నెంతనివగతు!

ఉ. ఎంతటి దుష్కృతింజలిపి • తేమన, నిన్ను రమామనోహరా!
యింతటి దార్ష్ట్యమే, యకట • యింతటి క్రౌర్యమె! యేటికయ్య దు
ర్గాంత పతివ్రతాత్వ మది? • ధర్మపదం బదియేల? నేల వే
దాంతములన్ దురంతము? లటంచు వచింపఁగరాదు యీపయిన్?

విష్ణు—కాంతామణీ! నాపలుకుల నించుక యాలింపుము.

తులసి—(వినిపించుకొనక) దేవా! పరమేశ్వరుడవే! సకలవిబుధ నికరవంద్యుండవే! జగత్కారణుడవే! దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాబద్ధకంకణుడవే! నీవా యిట్టిపనికి గడంగుట? నీవా యిట్టి నీచకామమునకుఁ జిక్కుట?

చ. పరమపతివ్రతామణులఁ • బట్టి దురాత్ములు భంగపెట్టుచోఁ
బరువిడి వచ్చిప్రోచెడు కృపాపరతంత్రుఁడ వీవ! దేవ! యి
ప్పరుసున ధర్మ మగ్గి నిడి • భంగమొనర్చితి సత్పతివ్రతన్
హరిహరీ! యిఁక దిక్కు గలదా సుచరిత్రల కీ జగత్త్రయిన్?

అక్కటా! కన్నతండ్రియే కసిగందు నెడఁ బిసికి చంపినట్లు, ఆలకాపరియే గోవు కుత్తుకఁ గొంకొంకఁ గోసినట్లు, జగద్రక్షకుఁడవు నీవే యీ దీనురాలిని, ఈ యమాయకురాలిని, ఈ దిక్కులేని యకించనురాలిని భంగపెట్టుదువే! అయ్యయ్యో! నీ వినిర్మలకీర్తికి, నీ యార్తరక్షణాంకమునకు, నీ ధర్మసంస్థాపన పరాయణత్వమునకు, నీ సృష్టికే భంగము గలుగుననియైన యోజింపకపోయితివే.

సీ. భగవంతుఁడవు నీవ ♦ పాపంబనక దేవ !
యింతద్రోహము సల్పి ♦ తింకపైని
అఘమన నేమి ? పు ♦ ణ్యంబన నేమి? దు
ష్పథమన నేమి? సు ♦ త్పథమనంగ
నేమి? యేమిటి? కింక ♦ నీమమ్ము వోనాడి
సంచరింపఁగరాదు ♦ సర్వజనులు ?
నీచరిత్రము విన్న ♦ నీచులు సాధ్వీమ
ణుల భంగమొనరింపఁ ♦ దలఁకువారొ ?

గీ. తలఁక కటు భంగపెట్టిన ♦ తగుననుచు
నేమొగంబున శిక్షింతు ♦ వీవు వారిఁ?
దెలిసి సృష్టికే భంగము ♦ దెచ్చిపెట్టి
కొంటివయ్యో ! మోహమ్మింత ♦ గూర్చెనయ్యొ !

విష్ణు—కాంతామణీ ! నిన్నుఁ జెఱచుటకుఁ గారణము మోహము గాదు సుమీ !

తుల—ఏమి ! దేవదేవా ! మోహము గాదనుచుంటివా ? అగు. నీ మాట నిక్కమైయుండును. ఇదియు నాతలవ్రాతయే.

ఉ. నీవు పరాత్పరుండవు, వి ♦ నిర్మల ధర్మరతుండ వాపయిన్
దానవ పుత్త్రిఁడల్లర కొ ♦ దన్ దమకమ్మును గూర్చు మారుఁడున్
నీవనజాతనేత్రి రమ ♦ ణీగుణశీలగా రమ, యిట్టి నీకమో
దేవ ! యిఁకేమిమోహము, మ ♦ దిన్ గననియ్యది నాదుప్రాప్తియే.

కాని పరమేశ్వరా ! ఇట్టి ఫల మనుభవింపఁజేయుటకుఁ గారణముండవలయుఁగాదా ? దయచేసి చెప్పుము.

విష్ణు—అలివేణీ ! ఆలింపుము. నేను దుష్టశిక్షణ శిష్టరక్షణ దీక్షాబద్ధకంకణుండనని నీవ చెప్పితివికదా ! అగును. కావుననే దుష్టుఁడును లోకద్రోహియు నగు నీ ప్రాణేశ్వరుని జంపి, శిష్టులగు

సురలను, జగల్లోకుల రక్షించుకొనుటకు నీ పాతివ్రత్య మొక్క
త్రోయరాని యవరోధమగుటచే నిట్లు చేసితి. మఱియు—

తుల—లక్ష్మీనాథా! నా ప్రాణేశ్వరుఁడు దుష్టుఁడా? సురలు శిష్టులా?
ఏల? వారి రాజ్య మాక్రమించుకొనుటచేతనా? భుజాబలంబున
పరులఁ గెల్చి వారి రాజ్యము గైకొనుట శూరధర్మముగాదా?
ఆక్కటా! దేవదేవ! నీ వెంత సురపక్షపాతివి!

క. సురల శిష్టులు? తక్కిన ♦ నరు లసురులు
దుష్టులని నీకుఁ గోఁచినఁ ♦ దోయజాక్ష!
వారి కోఁ గుల్కరారా? యిం ♦ ద్వారి సృష్టి
సేయనేల? ధర్మువు వీడి ♦ చెంతనేల?

విష్ణు—కాంతామణీ! నీవు నిక్కమెఱింగియుఁ బత్యభిమానంబున నిట్లు
పలుకుచుంటివి. భుజాబలంబున రాజ్య మార్జించుట ధర్మమే.
అంతట నూరకుండెనా నీనాథుఁడు? సాధుజనుల నొందఱి
బాధింపలేదు? సాధ్వీమణుల నొందఱఁ జెఱపట్టలేదు?

తుల—ఆర్యా! నా ప్రాణేశ్వరుఁడు సాధ్వీమణులఁ జెరపట్టినందులకు
దుష్టుఁడయ్యెనా? చెరపట్టెనేగాని, భంగపెట్టలేదే? ఇట్టి మా
యవేషములు దాల్చి యేకాంతనైన నన్యాయ మొనర్పలేదే?
అట్టి నీచపుఁగార్యము లొనర్చిన మొదటివాఁడు నీయిందుఁడు.
అతఁడు గౌతమాంగనఁ జేసిన కెఱంగు నీ వెఱుఁగుదువు. రెండవ
మహానుభావుఁడవు నీవు! ఇట్టి వంచకులు—మీరు సురలలోని
వారగు గావున శిష్టులు. చాలు! సురపక్షపాతీ! క్షీయధర్మశాస్త్ర
పరాయణా! నీవు నిశ్చయముగ ద్రోహివి. ఇట్టి నిన్ను నమ్మి
లోకులు మోసపోవుచున్నారు. అది యటుండ నీవు నన్ను భంగ
పెట్టుటకుఁ జూపిన కారణ మెంతబాగుగనున్నది? నా నాథుఁ
డొకవేళ దుష్టుఁడే కానిమ్ము నీకంటెను—అయిన నా నాథుని

శిక్షింపవలయుఁగాని యీ నీచకార్య మేమి? ఈ దొంగవేస మేమి? తల్లియావు తప్పుఁజేసెనని లేఁగను శిక్షింపవలసినదా? లోకులమేలుకొఱకు చేసితి నందువు కాఁబోలు? అది యైన నేమి సమంజసముగ నున్నది?

గీ. లోకులకు మేలుసేయఁగ ♦ లోఁ దలంచి
చెఱతువే దేవ! పావన♦శీల నన్ను
లోకులకు మాంసము నొసంగ ♦ లోఁ దలంచి
సాధుమృగమును జంపుట ♦ చనునఁటయ్య!

అయినఁ గటికవాఁడు గూడ నినుఁబోలు లోకోపకారియే.

విష్ణు — అతివా! నాచెప్పువాక్యముల సాంగముగ నాలింపక నీవు నన్ను దూషించుచుంటివి. నీ కిట్టి దుస్థితి గలుగుటకు నీనాథునిమాట యటుండ ముఖ్యముగ మఱియొక కారణమున్నది. ఆలకింపుము. పూర్వజన్మంబున నీవు తులసియను దేవకన్యవు. లక్ష్మీ దేవికిఁ జెలికత్తెవు. నన్నుఁ బొందఁగోరి పెక్కువత్సరములు తపం బొనర్చితివి. అయిన నాజన్మంబున నీ కట్టిప్రాప్తి లేదనియుఁ బిమ్మటి జన్మంబున నట్టి భాగ్యము నీ కబ్బుననియు నీకు వర మొసంగి నీతపము నాపించితి. కాని యప్పుడు నీకు నాయెడఁ గల మోహ మాఁపరాకయుండెను. దానం జేసి నీవు నన్ను మోస మునవైనఁ దలియఁగోరి, యొకనాఁడు నేను శయ్యాగృహ మున నుండఁ బద్మాలయ లేకుండఁజూచి యేకాంతరూపున నచ్చటకు వచ్చితివి. మోసము గ్రహించియు నేను నిద్రితుని వలె సెజ్జపైఁ బరుండి మాటాడకయుంటిని. నీవు నన్ను లేపఁ బ్రయత్నించుచుంటివి. ఇంతలోఁ గమల యచ్చటకు వచ్చెను. నిన్నుఁజూచి, మోస మొనర్చి నన్నుఁ గూడితివని తలంచి లక్ష్మీ దేవి కోపంబున "ఓసీ! పాపాత్మురాలా! నాకుఁ జెలివై యుండి

మెంత చేసితివి! ఇందులకు ఫలమనుభవింపుము. నీవు దానవునకుఁ బుట్టి, ఇష్టములేని నిన్ను బలవంతమున భంగపెట్టఁ బ్రయత్నించి నాచే మున్ను దానవుఁడై పుట్ట శపింపఁబడిన సుదాముని కిల్లాలి వయ్యెదవుగాక! మఱియు నీభర్తరూపమునఁ బరుఁడొకఁడు నిన్నుఁగూడి నీపాతివ్రత్యముఁ జెఱచుఁగాక! ఆపై భూలోకమున నొక వృక్ష మయ్యెదవుగాత” మనిక్రూరముగ శపించె. తరువాత నీవు తప్పు నొప్పుకొని శోకించుచు మన్నింపుడని నన్నును బద్మాలయను పాదములబడి వేఁడికొంటివి. కమలయుఁ బ్రసన్నురాలై నిన్ను శపించినందులకుఁ బశ్చాత్తాపమందె. నేనును గరుణాంతరంగుండనై, శాప మనుభవించి తీరవలయు. అయిన సుదాముఁడు నీకు భర్తయయ్యుఁ గొండొకకారణమున నిన్నొల్లకయుండుననియు, నీకన్యాత్వము చెడకుండునని యు, గొన్నాళ్ళకుఁ బిమ్మట నేనే నీపతిరూపంబున వచ్చి నిన్ను భంగమొనర్చెదననియు, నంతట నీవు పతిఁజొచ్చి, లోకంబున వృక్షమై పొడమి సర్వజనులచేఁ బూజింపఁబడెదవనియు, నాన తిచ్చితి. దాననే నీ కిట్టి భంగపాటొదవె. పూర్వజన్మంబున సుదాముండగు జలంధరుఁడు నీభర్త నిన్నొల్లకయుండుటకుఁ గారణము సిదియే. ఇదియంతయు సత్యము.

(నేపథ్యమున నానావిధ కంఠస్వరములతో)

సత్యము! సత్యము!

విష్ణు—వింటవా! సర్వభూతములు నామాటలు సత్యమని వాకొను చున్నవి. ఇప్పటికైన నామాటలు నిక్కములని విశ్వసించితివా!

తుల—పరాత్పరా! విశ్వసించితిని. సత్యస్వరూపుఁడవు నీ వబద్ధమాడెదవా! మఱియు న్యాయాన్యాయవిచక్షణదక్షుండవు నీవు

నిష్కారణముగ నట్టిపాపిష్ఠనైన శిక్షింతువా! ఇది మత్పూర్వ జన్మకృత దోషఫలము. నా దురదృష్టము.

(జలంధరుని శిరము జూచి శోకముతో) హా! ప్రాణ నాథా! దానవసార్వభౌమా! నీ కెట్టిగతి పట్టినది.

(అనుబంధము 14.)

ఆ. వె. వలదు వలదు శివుని ♦ బట్టవుదేవిని
వలచు టది యఘంబ ♦ పాయకరము
వలదు వలదు కలను ♦ వలదన్న వినవైతి
తుదకు నిట్లులైతి ♦ హృదయనాథ!

సీ. నాపాలిదైవమ్ము ♦ నాపెన్నిధానమ్ము
నామనోరమణుండు ♦ నాప్రియుండు
నాపరిభుం డింతకు ♦ న న్నెల్లకుండిన
నెన్నటికే నెల్ల ♦ డే యటంచు
నడియాస గొన్నాళ్ళ ♦ గడపితి, నయ్యాన
యడుగంట హృదయేశు ♦ నంతనుండు
నట్టిభాగ్యంబున్న ♦ నదె చాలు ననుకొని
గడపితిఁ గొన్నాళ్ళ ♦ గడకు విడువ

గీ. అచిరత మాంగల్య ముండిన ♦ నదియ చాలు
ననుచుఁ గడపితిఁ గొన్నినా ♦ ళ్ళకట! నాథ!
ఏమియాసఁ గడపుదాన ♦ నింక నుసురు
నేమి చూచికొనుచు భరి ♦ యించుదాన?

హా! ప్రాణేశ్వరా! ఈరమానాథుఁడు సాధ్వసగు నన్ను భంగపెట్టి నిరప రాధుని ని న్నుమానాథునిచే జంపించునే! (కోపావేశమున నుడలె ఖుంగక) ఓలక్ష్మీకళత్రా! దానవవైరీ! సురపక్షపాతీ! పాషాణహృత యండవై మా కొనర్చిన యన్యాయమునకు ఫల మనుభవింపుము.

నీవు పాషాణహృదయుండవై నన్ను భంగ మొనర్చితివి. కాన నందు
లకుఁ దగినఫల మనుభవింపుము.

సీ. అమలపతివ్రతా ♦ త్వమున నొప్పెడుకాంత
భంగపెట్టుట మహా ♦ పాపమేని
పరులకోసంబైనఁ ♦ బాపకార్యంబును
గావించుటయు నొక ♦ కలుషమేని
పాపకృత్యము సేయు ♦ భగవంతుఁడైన శి
క్షార్హుండగుట నిక్క ♦ మగునయేని
ధర్మంబునందును ♦ దనరెడు దైవమ్ము
నను మాట నిశ్చయం ♦ బౌనయేని
గీ. పతియటంచు భ్రమను బొంది ♦ పరునిఁ బొందు
పడఁతి నరకకూపమ్మున ♦ బడదయేని
దత్పతివ్రతాత్వం బెల్లఁ ♦ దగ్గదేని
అంబుజేక్షణ! పాషాణ ♦ మగుదుగాక!

(విష్ణువు పాషాణమగును.)

తుల—హా! ఇదియేమి! నే నేమిచేసితిని? కోపావేశంబున నొడలెఱుం
గక యీమహామహుని శపించితినా? శపించెదఁగాక! ఆశాపము
నెఱవేఱుట యెట్లు? నా పాతివ్రత్య మడుగంటుటంబట్టియే కదా
నా నాథుఁడు గతించె. తిరిగి నా కింతమహిమ యెట్లుగలిగె? హా
తెలిసె. ఇందులకుఁ గారణ మీ జగత్కారణుని ధర్మరక్షణాసక్తి
యేగాని నాశక్తిగాదు. ఓ కమలాప్రియా! పరమకరుణానిధీ!

గీ. పొరఁబడితిఁగాని నిక్కంబ ♦ పూతచరిత
తులసి సాధ్వి యనెడు మాట ♦ నిలుపుకొఱకు
అంబుజేక్షణ! పాషాణ ♦ మైతివయ్య
నీవు ధర్మబద్ధుఁడవంట ♦ నిక్కంబు.

అక్కటా! ఇట్టిధర్మబద్ధుని నిన్నన్యాయముగ శపించి యెంతటిపాపమున కొడిగట్టితి! దేవా! నన్ను క్షమింపుము.

[ప్రవేశము: దివ్యులు, లక్ష్మీదేవి.]

లక్ష్మి—అమ్మా! క్షమింపవలసదానవు నీవు. నాకుఁ బతిభిక్ష పెట్టవల సినదానవు నీవు. (పాదములఁ బడఁబోవును.)

తుల—(ఆపి) అమ్మా! పద్మాలయా! నే నెంత! నా ప్రభావమెంత! ఇదియు నామహాత్ముని ప్రభావమే.

లక్ష్మి—తల్లీ! అటులే కానిమ్ము! తన్ను శపించుటకుఁ దగిన ప్రభావ మొసంగిన యాకరుణానిధి శాపము గ్రహించుటకు మాత్ర మొసంగఁడా! కానఁ గరుణింపుము.

తుల—జగజ్జననీ! నేను నన్నుభంగపెట్టుటలో శ్రీహరితప్పు లేదనితన్ము ఖంబున విని విశ్వసించియుఁ, గ్రోధావేశంబున నొడలెఱుంగక శపించితి. ఇట్టి నే నామహనీయుని మో మెట్లుచూతు? అయిన నే నిప్పుడు చితిఁజొచ్చెద. ఆవల నమ్మహాత్ముఁడు తులసి సాధ్వి యను మాట నిలుపుటకుఁ బాషాణమైనట్లు, ఆమాట మఱి యు నిర్ధారించుటకుఁ దనరూపముఁ దాల్చుఁగాక!

దివ్యులు—అనుగ్రహింపఁబడితిమి.

తుల—దాసీ! నాకుఁ జితిం బేర్పుము.

[నేపథ్యమున—చిత్తము]

తుల—(జలంధరుని శిరమునుజూచి శోకముతో)

గీ. ప్రాణనాయక! నిన్నింత ♦ వఱకు నంటి
యెఱుఁగ నపవిత్రనై స్పృశి ♦ యించుచుంటి,
ఇట్టి నాయఘంబును క్షమి ♦ యింపు మిప్పు
డేని యుంటక యెట్లు త ♦ రింతు నేను?

(శిరముఁ జేతదాల్చును.)

[నేపథ్యమున]

అమ్మా! చితి సిద్ధమైనది.

తుల—ఇదిగో! నేను సిద్ధముగనే యుంటిని.

గీ. ప్రాణనాయక! నీకోడఁ ♦ బాన్పునందు
నను శయనించి యెటులఁగ నే ♦ యెనసుకొన్న
భగ్గుభగ్గున మండు నీ ♦ యగ్గిలోనఁ
గలుపుచుంటి నీతోడ నా ♦ కట్టె నిదుగో!

తండ్రీ! సర్వభక్షకా! వీతిహోత్రా!

ఆ. పతికిఁ బనికిరాక ♦ పతితమై, పరునిచే
మఱియుఁ బతితమైన ♦ మచ్ఛరీర
మదిగో! వేల్చుచుంటి ♦ ముదమున నపవిత్ర
మనక కృపభరింపు ♦ మయ్య! తండ్రి!

(నిష్క్రమించుచున్నది.)

దివ్యులు—హా! హా! తులసీదేవి భస్మమైపోయినది. తల్లీ! సాధ్వీమ
తల్లీ! ధన్యవు.

విష్ణు—(స్వరూపముఁదాల్చి) తులసీదేవి చితింజొచ్చి ధన్యురాలైనది. ఈవరారోహచరిత్రము ప్రస్తుతిపాత్రము. ఈసాధ్వీసమాధిపై నొకమొక్క మొలచి యాతులసిపేరఁ బరఁగుఁగాక! ఆతులసీవృక్షము భక్తజనులపాలి కల్పవృక్ష మగుఁగాక! మఱియు,

గీ. మహితసుమమాల్యమునకన్న ♦ మంచిముత్తె
ములసరమ్మున కన్నను ♦ భూరిరత్న
హారమునకన్న మాకుఁ బ్రి ♦ యంబుగూర్చి
వెలయుఁ గావుత మీఁదైని ♦ తులసిమాల!

మఱియు,

సీ. అడవులు, మృగములు, ♦ నవనీరుహంబులు
పల్లెలు, గ్రామముల్ ♦ పట్టణములు
ఘన దేశములు, నవ ♦ ఖండముల్, జనములు
పసులు, సూర్యాచంద్ర ♦ మసులుఁ, జుక్క
లాశలు, గగనంబు, ♦ సంఘజన్ములు, నదీ
నదము, లంబుధులు, ర ♦ త్నములు, జలచ
రమ్ములు, శైలముల్, ♦ రక్కసుల్, బ్రహ్మాది
సర్వసుపర్వాణ ♦ సంచయమ్ము—
గీ. ఇన్నిటింబెట్టి దూచిన ♦ యేని లేవ
బోని కమలాహృదీశుఁ ♦ శ్రీపైని మ్రొగ్గ
సత్యము తులసినైనఁ ద ♦ చ్ఛాఖనైనఁ
దద్దళమునైన నిడినంత ♦ దక్షిణాంబ.
గీ. గుడులు గట్టుకంటె ♦ మడువులఁ ద్రవ్వించు
కంటె, వనము వేయు ♦ కంటెఁ, గ్రతుల
నందుకంటె నరయ ♦ నధికపుణ్యప్రదం
బగును దులసినాటు ♦ టవనియందు.
సీ. తులసీతరువు నింటఁ ♦ గలుగువారిగృహంబు
పద్మాలయకును ని ♦ వాసమగుత!
తులసిని బూజించు ♦ చెలికి సువాసినీ
త్వమ్మును సౌఖ్యంబు ♦ దనరుఁగాత!
తులసీవనము వేయు ♦ నలఘుపుణ్యాత్ముల
కాయువు సిరులును ♦ నలరుఁగాత!
తులసిని నన్నుగాఁ ♦ దలఁచి భక్తిండు సే
వించి యుంచితముక్తి ♦ గాంచుఁగాత!

గీ. మరణ సమయమందు ♦ గరిమను తులసితీ
ర్థమ్ము పోయఁబడిన ♦ ప్రతిజనుండు
తూళితాఖిలాత్మ ♦ కల్మషుండై నాదు
పాదసన్నిధికిని ♦ వచ్చుఁ గాత!

బృందారకులారా! ఇఁక మీకుఁ గావలసిన దేమి?

బ్రహ్మ—మహాత్మా! నీ యనుగ్రహంబున లోకద్రోహి జలంధరుఁ డడంగె. లోకులకు మేలు చేకూరె. ఇంద్రాదులు కారనుండి యీవలకువచ్చిరి. ఇఁకఁ గావలసిన దేమి? అయిన నిట్లగు గాక

చ. చలమున నీ జలంధరుని ♦ చందమునన్ బ్రజఁ బాపమెంచకే
సిలుగులు వెట్టు భూమిపతి ♦ శీఘ్రమ నాశన మందుఁగావుతన్!
తులసియుఁ బోలె దైవమని ♦ తోరపుభక్తిని భర్తఁ గొల్చుచున్
బోలిచెను పూవుఁబోఁడికిని ♦ బొందక యుండుత మెట్టి బాములున్.

విష్ణు—తథాస్తు!

సంపూర్ణము



# అనుబంధములు



[సోమరాజు రామానుజరావుగారిచే రచియింపఁబడినవి]

1. బ్యాగ్—ఆది.

జలం—ఓహో యికనే । నిలువక చనియెదగా । రయముగా॥ ఓ॥

ఇలగలిగిన ధరాధీశ్వరులు విస్మయానుమతులై మతులధరక । ఖలుడై యమరేశ్వరు పూర్జితదర్పము చేతను మైమరచెనుగా॥ నేడోహో॥

నిరంతరణంబు మొనర్చెదక । నిజార్యులకు సంతస మిడెదన్ । జలంధరుం । డను యశమ్మున్ । దిశలెల్లను నిం । పెదగనుడీ॥ నేడోహో॥

2. జయంతశ్రీ - ఆది.

జలం—జనకా । వలదికా॥ జన॥

ఈజలరుహలోచన । సతిగాగాంచుటల్ । తొలు దొలుతనె పరిణయమున । విలసితసుమహారము నిల । బడనేసిన పరమదుష్ట భావనమది గోరనగునె॥ జనకా॥

3. బ్యాగ్—త్రిశ్రగతి.

జలం—ఓసీ యవిధేయురాల । యోసీ యహంకారచిత్త।వీనము నిను దయదలచుట । మోసమా । దోసమా॥ ఓసీ॥

ఖలమతి నాతోవాదా । చలము వహించితిగాదా । ఆరయఁ నీపాణిగ్రహణము సేయుటె పాపమయ్యె॥ ఓ॥

సుకవిజేత । నయి యాతీత । భరము దాల్చియుంటిగా । నిరుప

మాన్వయము గళంక । మగునటుసలిపితి । మగువరో॥ ఓసీ।

---

4. భాగేశ్వరి—త్రిశ్రగతి.

తులసి—అలలలలలలహృదయేశ్వర నను దయగనుమా॥ అల॥

మీాచరణము లంటవేడుదాననో దయాకరా యోచనసలుపకవి

రోధమెనరుపదగునా॥ అల॥

కరుణదలపుమా । నామనవి వినుమా । ధరణిము నభములు

సాక్షిగ దలచితి మిముభర్తగా॥ అలఅల॥

---

5. తోడి - ఆది.

తుల—సుగుణాన్వయభరణా । భాసురవరచరణా ॥ సు ॥

పగమీారక । ననుగనుట । భావ్యంబా । శుభచరితా ।

జలం—ఖలాత్మురాలవు । దురాత్మురాలవు । పిశాచినీ నినుతుమీతు

నా । కులంబు నట్లాకులంబుజేయక । దలచితివిగా । ఖల

మతివిగా । నిజమువేగా । శిరమును దునిమెద ॥

తుల—నాయందున ప్రేమను గనుమా । న్యాయమైన మార్గము

వినుమా । అబలామణి నిటు లార్తినిడక మనుమా । జన దూ

షితమయిన పనులు విడుమా॥ సుగు॥

జలం—ఊరకయుండిన కారులుప్రేలెదవా । దురితాత్మక కావరమా ।

కాలుని పాలునికి నంపెద జూడుము । నీరుధిరము । నదముగ

సిదెజనగా ॥

తుల—సుగుణా న్వయభరణా॥

## 6. బ్యాగ్—అద్రితాళం.

జలం—ఎంతటిపనిగావించె శచీపతి।

సుంతయైన నే దెలియను నారద॥యెంత।

పంతమునను నాదారనిర్జ జెర।

బట్టగనెట్టుల నెంచెదలంచెను॥ యెంత॥

వానికంఠమును దునాదున్కలుగ। ఖండించెద దండించెదగా।

యతుల సిద్ధుల సాధ్యుల నెల్లరశిక్షించెద పరివార్చెద తీర్చెద॥ ఎంత॥

---

## 7. కాంభోజి—ఆదితాళం.

తులసి—వినుమాసురనాథా।వినయమునను నినువేడెద మనమున॥ వి॥

ఆసురమగుపనియిదిగాదా। నీ సము లిటుసలుపుటమేలా। నా

నవ నీయశమదిపోదా॥ విను॥

---

## 8. బ్యాగ్—ఆదితాళం.

జలం—ఓరిదురాత్మా। ధీరుడవైనా। యువిదను తులసిని జేరితివా॥ ఓరి॥

కారులుపేలకురా నినురక్షుమున। ఖండించెదరా। యరానా

రా॥ ఓరి॥

కూరిరముగా ధరణికి భారముగా। రాక్షసవైరముగా। ఘనరిపు

హారముగా। సారపరాక్రమవిక్రమసంయుత। జాలంధరు మరిమా

చితివా॥ ఓరి॥

---

ఝ్యాన్—ఆదితాళం.

జలం—ఓరీశైలవి.  . యిమ్మువధించెదరా। బంధించెదరా॥ ఓరీ॥

కార్యము గాదది సురాకలశమ్మును గదురయమున నర్పించుట హితమగు॥ నోరీ॥

అనృతలాపము లాడుట తగదిక। నదను గతించెను మించెనురా। ననయంబుగనే। నడిగెదనిపుడే। సమర్పింపదగునోచెడుగా॥ ఓ॥

---

10. బ్యాన్ - ఆదితాళం.

జలం—వెను వెంటన్ బడి। నినుబలవంతము। గనుగొనిపోవక మానను వినవే॥ వెను॥

ననురాతిర్రించర। ఘనవిభునవహేళన మొనరింతువె యఘచారీ॥ వెను॥

త్రిశ్రగతి.

పార్వ—తగునటరా సురవిరోధి। తరుణులనిటులీడ్చుట। జగతిని పరమపవిత్ర। శాపము ఘనతరమురా॥ తగు॥

ఆదితాళం.

జలం—ఓతరుణీమణి యిదివినవే। నీతులు నాయెడసరిపడవే। పాతకమదియని। పలుకగ వలదిక। భ్రమదీర్చుటసాఫల్యముగా।

పార్వ—చెడెదవు సుమ్మా। దురితమతీ।

జలం—వదరకుమా। యిక పరుమగతీ।

# హనుమద్రామ :

ఆఱంకముల. నాటకము.

(గ్రంథకర్త: బద్దిరెడ్డి కోటీశ్వరరావుగారు.)

ఇందు యయాతి రాజును గురించి శ్రీరామాంజనేయులకు (జ)రిగిన ఘోరయుద్ధము చూపబడినది. విశ్వామిత్రుని కోపము, యయాతుని విచారము, అంగదరాయబారము, హనుమంతుని సత్య వాక్య పరిపాలన, రామునియొక్క గురువాత్సల్యము, మొదలగు సంగతులతో విరాజిల్లుచున్నది. ఇదంతయు గరుడోపాఖ్యానమువలెనే యుండును. ఎన్నో ప్రతులు లేవు. త్వరపడనిచో ప్రతులు దొరక నేరవు. వెల 0—12—0.

# విజయభాస్కరము

ఆఱంకము — నాటకము.

(గ్రంథకర్త: పిడుమ్మలమఱ్ఱి లక్ష్మీనృసింహముగారు.)

ఇందు భట్టి విక్రమాదిత్యుని మనుమడగు విజయభాస్కరుని చరిత్రమంతయు మనోహరమగు శైలిని చక్కని సాంగ్సులో వ్రాయ బడినది. విజయభాస్కరుని శౌర్య ధైర్య గాంభీర్యములు చదివిచూడ వలెనన్న ఈ నాటకమే తప్పక చదువతగినది. వెల 1—0—0.

# సంగీత గులోబకావలి

(గ్రంథకర్త: చక్రవధానుల మాణిక్య శర్మగారు.)

నవరసములలొ ముద్దుల మూటగట్టు నాటకరాజము. ఈ నాటకమంతయు శృంగార రసమే. ఎచ్చట చదివిచూచిన ఆనందమే, నాటకము చదువుట మొదలుపెట్టినచో, సాంతమగువరకు విడువ రు. ఇందచ్చటచ్చట పార్సీమట్లు గూడా చేర్చబడినవి.

వెల 1—0—0.

వలయువారు:- కంమలగోవిందం, జనరల్ బుక్కుడిపో,

బెజవాడ. కృష్ణాజిల్లా.